

# శ్రీనివాసుని  సంకీర్తనలు



సప్తగిరి మందిరా.. సిరిహరిసుందరా..
కరుణారససాగరా.. కలియుగేశ్వరా..

ఇక్ష్వాకుల ఈశ్వారా.. సకలలోకసర్వేశ్వరా..
హరిహరేశ్వరా..  ఏడుకొండల వెంకటేశ్వరా..

సకల గుణాకరా.. గోకుల గగనాంతరా..
ధైత సంహార.. దివిభువి శుభంకరా..

ఆకర ఉకార.. ఓంకార ప్రణవాకారా..
మునిమన మందార.. మోక్ష మహిమాన్యేశ్వరా . .

పాహిమం పాహిమం పద్మావతిప్రాణేశ్వరా...
శరణం శరణం  శ్రీస్వర్గలోకేశ్వరా శ్రీవెంకటేశ్వరా..



# శ్రీనివాసుని  సంకీర్తనలు



జ్యోతినై  వెలగాలి  నీ సన్నిధిలో

పువ్వునై రాలాలి  నీ పాదసన్నిధిలో

మల్లెనై ఒదగాలి  నీ మెడలో

వెన్నెలై వాలాలి  నీ ఒడిలొ

సిరినై నిండాలి  నీ ఎదలో

శ్వాసనై చేరాలి  నీ వేణువులో

పాటనై పాడాలి  నీ మదిలో

రాధానై ఆడాలి  నీ కొలువులో

  

 **శ్రీనివాసుని**  **సంకీర్తనలు** 

వలచి వచ్చినారు,

వలపు తెచ్చినారు,

పిలుపు నిచ్చినారు

సిగ్గులు ఒదలినారు,

సమ్మతము తెలిపినారు,

సతులెల్ల చెలిమికొచ్చినారు

వాడివేడి కన్నులతోన,

వెన్నెలలాంటి వెన్నముగ్దలను,

విందులార గిన్నమన్నారు

ముగ్ధమనోహర రూపముతోన,

మాలియలను మురవరముగా,

మనసారా ముద్దులాడమన్నారు

సెలయేటి అలలనందాలతోన

చెణుకులాడే సల్లని చిరుగాలై

సకలకళా సరసాలాడమన్నారు

జాబిల్లి జానతణములతోన

జాగరణ జేయాలని

జతజేరగ రమ్మన్నారు !



# శ్రీనివాసుని  సంకీర్తనలు



పలకరో  హరి నామం

కనరో  విష్ణుని రూపం

వినరో  క్రష్ణుని లీలలు

కీర్తించరో రాముని  గుణాలు

తొలుగును అజ్ఞానం

కలుగును  సుజ్ఞానం

పొందేవు  పరిపూర్ణం

ఇదేభాగవత సారాంశం

భగవంతుని చేరు మార్గం



# శ్రీనివాసుని  సంకీర్తనలు



తిరుమల వచ్చాను  రామాహరి

తిరుమలేశుని చూచాను రామాహరి

తలనీలాలు నిచ్చాను రామాహరి

చేతులెత్తి  దండమెట్టెను రామాహరి

చిన్ని మనసుమొర నాలకించరా  రామాహరి

నీ కరుణాకటాక్షాలు కలిగించారా రామాహరి

దయచూపి వరమివ్వరా రామాహరి

కనికరించి కరుణచూపరా రామాహరి

ఆశీర్వదించి అష్టాఐశ్వర్యాలివ్వరా రామాహరి

ఆయురారోగ్యాలను  ప్రసాదించరా రామాహరి

ఈచిన్నివాని కోరికలు తీర్చరా శ్రీహరి

ఏడుకొండలవాడ వెంకటరమణా గోవిందా గోవిందా ..........!



# శ్రీనివాసుని  సంకీర్తనలు



బ్రహ్మ చేసిన బొమ్మవో

బాపు గీసిన సీత్రానివో

కనులు నచ్చిన కమలానివో

మనసు దోచిన  సిరిమల్లెవో

సిరులు కల్గిన  శ్రీలక్ష్మివో

శివుని నెత్తిన గంగవో

శ్రీహరి నచ్చిన శ్రీవల్లివో

మురారి మెచ్చిన వృందానివొ!



# శ్రీనివాసుని  సంకీర్తనలు



లచ్చుమక్క లచ్చుమక్క లచ్చుమక్కో

మాయదారి మలయప్పను చూసినానక్కో

కొండమీద నున్నాడు లచ్చుమక్క

కోనలోన  దాగినాడు లచ్చుమక్క

వచ్చేవారు, పోయేవారు సందులేరక్క

ఇచ్చుకోనేవారు పుచ్చుకొనేవారు ఎందరోనక్క

కోరికలు కోరేవారు కోకల్లలక్కా

కొదువలేక కరిమేఘుడై కరుణిన్చుతున్నాడక్క

పరమాత్మయని పాదాలకు మొక్కుతున్నారక్క

సర్వాంతరయామియని సకలసేవలు చేయుచున్నారక్క

హరివిల్లులతొ రంగవల్లులు వేసినారక్క

రంగరంగ వైభవంగా రంగనాధుని నలంకరించినారక్క

కోటికాంతులతో కమలనాధుడు కళకళలాడుచున్నాడు

వెండికొండలపై వెన్నలై విరాజిల్లుతున్నాడక్క

ఏమిసెప్పనక్కా  వేంకటేశుని వింతవింతలక్క

ఎన్నిజన్మలైన చాలవు వర్ణిన్చడానికక్కా

ఏడుకొండలకు ఒక్కసారి వెళ్ళొద్దామక్కా

వెంకటవిభుని వైభవాలు చూసివద్దామక్కా






సిరులుగిరుల సిన్నోడే సూడసక్కనోడే
సప్తలోకసుందరాంగుడే సప్తగిరిశ్రీనివాసుడే
సూదంటి సూపులతో సక్కలిగింతలెపెడుతున్నడే
సందేలకొచ్చినాడే సందమామను తెస్తానన్నడే
ప్రేమ ప్రణయం నంటూ వెంటబడ్డాడే
సావాసమంటు సరసాలు సెయ్యమన్నడే
సిగ్గాయేనే మొగ్గాయేనే బుగ్గేమో ఎరుపాయెనే
బెరుకాయెనే సురుకాయెనే మనసేమో బరువాయేనే
తప్పుతప్పురాసామినంటే తాళలేనన్నడే
కాదుగూడదంటే తిరుమలగిరులు రాసిస్తనన్నడే
మాఅయ్య ఒప్పుకోడంటే మంగా మనువాడతానన్నడే
ముత్యాలపందిరిలో ముచ్చటగా మూడుముళ్ళు వేసినాడే
మున్నాళ్లకే మూడునామాలవాడు మాయమై పౌఇనాడే
ఏడేడుకొండలెక్కి ఏడుకొండలవాడై వెలిసినాడే!

రగడేలరా నాతో రామచంద్ర

రక్షించక నను రామచంద్ర

రామనామము జపించితిని

రామాలయము కట్టించితిని

రాముడే దేవుడని

శ్రీరాముడే సర్వమని

సర్వదా నిన్నే భజించితిని

సముద్రమంత కష్టాన్ని భరించితిని

ఇకనైనా ఇచ్చచూపరా ఇక్ష్వాకచిలకా

జాగుచేయక జాలిచూపరా జానకినాయక

నీకు నే రామకోటి రాసి రణరంగధామా

రాగాల పల్లకిలో ఊరేగించెదను రవికులసోమా...

అభిమానముతోఆరాధించితిని

అంతఃపురమునకు ఆహ్వానించితిని

జగడమాడక జతచేరరా జానకీరమణ

దయతో దర్శనంబివ్వర దశరధనందన..

 **శ్రీనివాసుని**  **సంకీర్తనలు** 

దండాలు దశరధరామ వేయి దండాలు నీకు కోదండరామా
రామపాదుకలతొ భరతుడేలిన రాజ్యమున రావణాసురుల రాక్షసకేళిలుతో
నవనారిసీతలమానాలు మంటకలిసిపోతుంటే అక్షయపాత్రతో పంచటక్షపరమాణాలు వడ్డించిన
కాశి అన్నపూర్ణెశ్వరి దయగల్గిన పవిత్ర భారతాన అన్నమో రామచంద్రా అన్న
ఆకలికేకలుతో అలమటించి పోతుంటే ఆదుకొనేవాడు లేక ఆపేవాడు లేక
పాలించేవాడు లేక పట్టించుకొనేవారు లేక రక్షించు రామచంద్రప్రభోనన్న రక్షించేవారు లేక
దయచూపు ధర్మప్రభోనన్న దారిచూపేవారు లేక భయంతో బిక్కుబిక్కుమంటోంది నా భారతమాత
విన్నా వినరాని న్యాయగాంధారిలా కన్నా కనరాని కలియుగగాంధారిలా
నాకేంటినన్న నవభారతనవయుగ సమాజామును చూచి వేదనతో విలవిలలాడుతోంది నా భారతమాత
రా కన్నభూమికై కదలిరా కౌసల్యరామ రా దివినుంచి భువికేగరా దశరధారామ
ధర్మాన్ని రక్షించారా రామ నాదేశాన్ని కాపాడరా రామ
శరణుశరణు శ్రీరామ ధర్మమో దశావతారకరామ
దండమో దశరధరామ వేయి దండాలు నీకు కోదండరామా

మన్ను తినకురా ముకుందా
వెన్న తినరా గోవిందా
మారాము చెయ్యకురా ముకుందా
మాట వినరా గోవిందా
అండాండ బ్రహ్మాండాంబులు దాచిన
ఆకలిగొన్న ఆచిన్ని బొజ్జనుచూచి
అమ్మ మనసు అలమటించెరా
వేళాయనని చల్ల తెచ్చెరా
వింత వింతలు జేయకురా
మహిమలెన్నో జూపకురా
కన్న తల్లిని మాయ జేసి
కన్ను కాంచక మన్ను తినకురా మురారి
కన్నతల్లి చేతి గోరుముద్దలు ముద్దులు రా
వెన్న ముద్దలు నారాగించరా నాద మురారి
కడుపునిండిన కలువకన్నులలో ఆనందం
కన్న మనసుకు మహాదానందం
పెంచిన ప్రేమకు పరమానందం
అమ్మ పంచే ఆత్మీయ్య బంధం
జయ కృష్ణా ముకుందామురారి
జయ గోవింద గోవింద గానవిహారి!

 శ్రీనివాసుని  సంకీర్తనలు 

గుడి తలుపులు తెరిచి

గుడి గంటలు మోగించినాను

గోవిందా గోవిందా

రవి కిరణమై ప్రసరించి

మా రేఈ తొలగించి

వేణు నాదమై విహరించి

ఆబాలగోపాలాన్ని అలరించు స్వామి

నీ దివ్యమంగళ దర్శనానికై

ముక్కోటిదేవగణం మునివర్యులు

వేదవేదాంతులు విచ్చేసినారు

ఆప్తుడవై ఆదరించి అభయమిచ్చేవని

తీరని కష్టాలు తడువగా తీర్చేవని

తిరుమలేశుని తిలకించలాని నిరీక్షిస్తూ

భక్త జన కోటి కిట కిటలాడెరే

గోవిందా గోపాల నామాలతో

గుడి ఆవరణాన్ని

మారుమోగించుతుండాగా

రా స్వామి శ్రీనివాస లేచి రా స్వామి

గోవిందా గోవిందా

గోపాల గోవిందా



# శ్రీనివాసుని  సంకీర్తనలు



నేను నేర్చిన పాఠం మరిచినా

బ్రతుకు నేర్పెను నాకు గుణపాఠం

నాదియన్నది ఏది లేదు

నీకునెవ్వరు తోడు రారు

చివరకు చేరేది సర్వేశ్వరుడనే

లయ లీనమయ్యేది లోకేశ్వరుడులోనే

కడకు మిగిలేవాడు కైవల్యముననున్నవాడే

కొలవవే మనసా తలవవే మనసా

జీవాత్మ నొదలి పరమాత్ముని

పరమాత్మ నుండి జీవాత్మకి

బంధాల నిడవని బంధీపై

గిర్రున తిరిగేవు కాలచక్రమున

ఇకనైన మేలుకొవే మనసా,మేలుకొని

గానము చేసి , ధ్యానము చేసి

,అర్చన చేసి, ఆరాధించి

మోక్షధాయుకుడను మైమరపించి

మోక్షము పొందవే మనసా !!!!!

కవితలోని భావం, పాటలోని పరమార్ధం

పరమాత్ముని సేవయే పరమోన్నతం

ఏడుకొండలవాడా వెంకటరమణ  గోవిందా గోవింద





# శ్రీనివాసుని సంకీర్తనలు

రంగ రంగా పాండురంగా

నీ మీదనే నాకు బెంగ

సూసొద్దమన్న శానా దూరమయే

వోయొద్దమన్న పైసా లేకపొయే

మల్లా వద్దామంటే వయసైపొయే

కనుసూపు కూడా అంతమాత్రమాయే

సద్దిమూట కట్టె సిన్నది వోయే

సేతిలొ ఊతకర్ర నిలవకపొయే

మరొజన్మందో లేదొ ఎరుగనాయే

ఎమీ సేతునురా రంగరంగా

వేరే దారేది కానరాలేదు పాండురంగా

అయ్యో రంగా నాకదే బెంగా

గుడినశిలగాక కదలి రారాదా రంగా

వచ్చి ఓసారి సూసి పలకరించవా పాండురంగా

పాండురంగా విఠలా పండరినాధ విఠల

అనీ పదాలు కలిపి పాడే జానపదం విని

సంతసించి నీ సెంతతీసుక వోరాద

రంగ రంగా పాండురంగా

 # శ్రీనివాసుని  సంకీర్తనలు 

చినదాని చూపుల్లో కరుకు

చిన్నిక్రిష్నయ్యకే సురుకు

కాంత మనసున ఏముందో

కలువ కన్నులవాడికే ఎరుకు

చూపులు కలిసిన శుభవేళ

మనసులు మురిసిన మల్లెలవేళ

మేఘమాయనే నాకాశము

మోహనమాయనే వృందావనం

కొండగాలి ఉరుకులాయే

సెలయేరు సిగ్గుమొగ్గలాయే

రాధామధవులు ఒక్కటాయే

అధరాలు అలల అలజడాయే

పూల పరువాలు పరవశమాయే

తుమ్మెద తేనెమధురిమతో తడిసిపొయే

తనువులు తీరము చేరిపోయే

తీపి జ్ఞాపకాలు తరంగాలాయే

 **శ్రీనివాసుని**  **సంకీర్తనలు** 

అలిమేలు అలుగకే

కలువన దాగకే

అందము దాయకే

కలవర పెట్టకే

నాడలేదు నే నాంచారితో

నమ్మవే నీ నాధుడని

నడిరేఇన నొప్పించకె

నందాలతో మెప్పించవే

కోరి కోరి వచ్చానే

కలువరేకులు తెచ్చానే

ఏకాంత సమయాన

నీఅందాల అంతఃపురమున

అనురాగముతో ఆదరించి

అలరించి అబ్బురపరచవే

భక్తులు బారులుతీరిరే

బ్రందాలై భజనలుచెసిరే

కోలాటమాడినారు కనులుగప్పినారు

కోర్కెలన్నికోరి కరుణించమన్నారు

ఏడుకొండలవాడ వెంకటరమణ

గోవిందాగోవిందయని యామార్చినారు

కనులు కలవరంబుకాగ

కలము గళముగాగ

ఎలుగెత్తి పాడనా

నీపాట ఈపూట

భక్తి పారవశ్యముతోడ

ఊరువాడ కదిలేలా

ఏరువాకై సాగేలా

ఏడుకొండలు వెలిగేలా

సప్తసాగరాలు సప్తలోకలు

సప్తగిరులు సప్తస్వరాలతో

ఏకంచేసి ఏడుకొండలవాడి

సంకీర్తన స్వరపరచగా

కాలమే గానమై

కీర్తించగా కలకాలం

కదలిరాడా ఘనశ్యాముడు

కరుణించడా కరిమేఘుడై

ఏడుకొండలవాడా వెంకటరమణ

గోవిందా గోవింద

 
# శ్రీనివాసుని  సంకీర్తనలు 

కార్తీక పౌర్ణమి రోజు

కోయలై కూసింది

కోటిరాగాలు పలికింది

కోటికాంతులు చిమ్మింది

విహంగమై విహరించి

వేణువులో చిక్కింది

మోహనరాగమై మురిసింది

అబాలగోపాలాన్ని మురిపించింది

పున్నమిలా పూచింది

పురివిప్పి ఆడింది

ప్రాణమై ప్రేమించింది

పరమాత్ముని పరవసింపజేసింది

నా కలం నా గళం

ఏడుకొండలవాడ వెంకటరమణా

గోవిందా గోవింద!





# శ్రీనివాసుని సంకీర్తనలు

స్వామి! నీవే నా లోకం

స్వామి! నువ్వే నా శ్లోకం

సర్వాకాలమందు శ్రీనివాసుడె నా లోకం

సర్వాలంకారమే శ్రీహరికి నా శ్లోకం

శ్రీరామ నామమే నాకు శరణ్యం

శ్రీకృష్ణ తత్వమే నా సంకీర్తనం

ఆకార ఉకారలు అల్లుకోంటూ

సరిగమాలు సమకుర్చుకొన్టు

అక్షరాల ఆటలలో స్వరాల పాటలలో

సర్వదా శ్రీనివాసుడనే స్మరిస్తే

రాముడై రావాలి,వేణువై నూదాలి

సప్త గిరిలు సిందులెయ్యాలి

శ్రీహరి సిరిలచ్చితో సౌఖ్యమవ్వాలి

నా గుడి గంటలను

గోవింద నామముతో గణ గణ మోగించగా

నా మన: మందిరానున్న

మాధవుడు మురిసి మెరవాలి

నాఆత్మలోనున్న పరమాత్ముడు పరవశించాలి

నా చెంతనున్న శ్రీనివాసుడు సంతసించాలి

జగన్నాధుని జపంతో నాజన్మ తరించాలి

జానకిరామునితో జన్మజన్మల బంధ మవ్వాలి

నిత్యం నీ నామస్మరణె నాకు లోకం శ్లోకం

ఏడుకొండలవాడ గోవిందా గోవింద !

 శ్రీనివాసుని  సంకీర్తనలు 

నా మదిలొని మౌనము

నా మాటలోని భాష్యము

నా ఎదలొని ప్రేమానురాగం

నా మనసులోని భావము

మాధవుడుకి నచ్చేనా

మోహన మనసుకి మెచ్చేనా

గోపాల రావేలా ఈవేళా

పశుపాల కార్తీకపౌర్ణమి వేళ

నా మదిలో వెన్నకుండ తొణికిన్దిలె

నా ఎదలొ కార్తీక దీపం వెలిగిందిలె

నామనసులో నీవెన్నెల రూపం విరిసిన్దిలే

నా కార్తీక దీపం మనవి మన్నించలేవా

జనార్ధన జత చేరగ రావ,

మోహన మురళి మ్రోగించగా రావ

గోపాల రావేలా ఈవేళా

పశుపాల కార్తీకపౌర్ణమి వేళ



# శ్రీనివాసుని



# సంకీర్తనలు



తేనెలొలికించు తెలుగు తల్లి

ముద్దులతనయుడే నా తిరుమలేశుడే

తలనీలాలకె త్రుప్తిపడ్డవాడు

తీరని కొర్కెలు తీర్చువాడు నా తిరుమలేశుడే

తేట తెల్లమైన తెలుగువాడు

తీయ్యని అభిరుచులు కలవాడు

తీయ్యని ప్రసాదము తినిపించువాడు

తనువెల్ల తీపు చేయువాడు నా తిరుమలేశుడే

తెలుగుగడ్డపై తెలుగువెలుగుల తేజోమయ్యే

తెలుగింటికి ఇలవేల్పు నా తిరుమలేశుడే

తారకమంత్రము భోధించిన తారకరాముడు

తన్మయత్వంతో తందనాలాడిన

తాండవక్రిష్ణుడు  నా తిరుమలేశుడే

తరతరాలుగా తరగని తెలుగుసంపద వాడు

యుగయుగాలుగా వెలుగొందుతున్న

వెంకటేశుడు  నా తిరుమలేశుడే

తెలుగు భాషా భావకవితాంజలికి బోయుడు వాడు

తెలుగు సంగీత స్వరాసుమాంజలికి సిందులెసిన వాడు

తెలుగొళ్ళ భక్తికి మెచ్చి మొక్షమునిచువాడు

తెలుగు భక్తి సాగరానికి తీరంవాడు

స్వర్గము నొదలి సప్తగిరులను

చేరినవాడు నా తిరుమలేశుడే

తిరుమలగిరులపై తారైనవాడు

 శ్రీనివాసుని  సంకీర్తనలు 

తెలుగు దేశాన తీగనై

నల్లినవాడు నా తిరుమలేశుడే

కులమతాలకు అతీతుడు వాడు

కొలిచిన కరిమేఘుడై కరుణించువాడు

తానె సర్వమైనవాడూ కాని తొందరపడనివాడు

నాపద తరుణాన తారసపడువాడు నా తిరుమలేశుడే

తెలుగు ముంగిళ్ళకు అద్రుష్టము వాడు

తెలుగు వారిని చల్లగ చూసే తిరుమలయ్య వారు

ఏడుకొండలవాడా వెంకటరమణ గోవిందా గోవింద

సహస్రనామాసురా

సంకీర్తనాముురవరా

సప్తగిరుల శేఖరా

శరణుశరణు శ్రీవరా

సిరిగిరినాయక

సకలలోకపాలక

సప్తగిరుల శేఖరా

శరణుశరణు శ్రీవరా

సుగుణాసుసంపన్న శ్రీధరా

సప్తగిరుల శేఖరా

శరణుశరణు శ్రీవరా

శ్రీధరా నీవే నాసర్వం

శ్రీవరా నీవే నాసర్వస్వం

శ్రీకరా నేను నీసొంతం

ఏడుకొండలవాడా గోవిందా గోవింద

కానరాని లోకాననున్నవాడు

కాని అందరిబంధువువాడు

గగనానున్నా గోవిందాయన్న

గ్రక్కున చెంత చేరువాడు

సుగంధాల సుమం

సప్తగిరుల శ్రీనివాసం

అన్నియు తానైఉన్నా

ఆ ఆప్తుడు నాకేసొంతం

ఏడుకొండలవాడా గోవిందా గోవింద

వెంకటరమణ గోవిందా గోవింద!



# శ్రీనివాసుని  సంకీర్తనలు



పుష్కరమల్లె రమ్మని గోదారడిగింది
బంధువులా రమ్మని బధ్రాద్రియడిగింది
సీతాసమేతుడై రామ నీవు రావాల
నురుగు తరగాలఎర్రై గోదారి పొంగాల
బద్రాద్రిమెట్టు తడవాలా తరవాలా
భక్తులు మునగాల మురవాలా
హరి నామము అలలై ఎగరాల
మాపాపలన్ని హరించి పోవాల!
రతనాలమ్మ మాయమ్మ జానకమ్మ
జాబిలమ్మై చల్లంగా  జూడాల!

గమ్యం తెలియరాని

ఈ జీవన పయనం ఎన్నాళ్లో

వెన్నెల నయనంలేని

ఈ చీకటి పయనం ఎన్నాళ్లో

పరమాత్ముని పరవశించలేని

ఈ పదముల పయనం ఎన్నాళ్లో

నా గానం చేరేనా తీరందాక

తిరుమలేశుని తీర్ధందొరికేదాకా

ఈ పయనం కొనసాగేనా చివరిదాకా

పరమాత్ముని కృప కలుగుదాక!

నీ చరణం నాకు శరణ్యం

నీ అభయం నాకు ఆవస్యం

నీ కృప నాకు భాగ్యం

నీ దయ నాకు ధైర్యం

నీ పూజ  నాకు పుణ్యం

నీ దర్శనంతో నాజన్మ ధన్యం

ఏకాగ్రతతో కొలిచేను నిన్ను

మనసారా దీవించు నన్ను

కృతజ్ఞతతో మళ్లీ వస్తాను నేను

తిరుమలేశా మొక్కు తీరుస్తాను నేను

ఆ దేవదేవుని చరణారవిందాలకు

ఈ చిన్ని చరణం మనవి





# శ్రీనివాసుని సంకీర్తనలు

తొంగి తొంగి చూడమాకు మామ

తొందరేలనే నీకు ఈరెయీ ఓ చందమామ

మాటి మాటికి పిలవకు మామ

మనసు నొప్పించకు ఓ చందమామ

ప్రొద్దుఇంకా వాలలేదు మామ

వెన్నెలఇంకా విరియలేదు ఓ చందమామ

సెలయేరు ఇంకా సర్దుతుంది మామ

వృందావనం ముస్తాబవుతున్ది ఓ చందమామ

వేళ కాని వేళ వచ్చినావు మామ

కుదరదోయ్ ఈరెయీ ఓ చందమామ!!!

ఓ కోమలి ఆ కొమ్మలు

నీ కోమలముతో కోలాటాలఆడనేల

ఓ వనమాలి ఆ వెన్నెల

నీ వలపులతో వయ్యారాలనాడనేల

ఓ సుకుమారి ఆ సెలయేరు

నీ సింగారాలతో సరసాలేల

నీ నగమొము నందాలు

నా మనసుని నివ్వెరపరచనేల

నీ గాజుల గలగలలు

నా గుండెలో గిలిగింతలుగానేల

నీ సుమధుర మందార దరహాసాలు

నా మదిలో సుగంధాలై ఓలలాడనేల

నీ పూలరవిక పరువాలు

నా ప్రణయాలను ప్రేమకలాపాలాడించడమేల

ఈ వృందావనములో నీయందాలు

నా వేణువుతో బంధాలువేయనెలా

ఈ సుందరనందనవదనం చూపులు

చిన్ని కృష్ణయ్యతో సిందులేఇంచే ఈవేళా!

హే గంగాతరంగా

హృదయాంతరంగా

శ్రీ రంగరంగా పాండురంగా

మది తలిచె ధ్యానంగా

మనసు పాడెనే మౌనంగా

ఎద మోహనమాయెనే మోహనారంగా

హే జీవనతరంగా

జలధీతారంగా

జనజీవనరంగా పాండురంగా

గగనాన తలుపులు తెరవంగా

గోకులానా గుడిగంటలు మొగంగా

గగనాంతరంగానని గోవిందుని  గొలవంగా

వేదన  వినరావా  వేదాంతరంగా

కరిమేఘుడై కరుణించరావా కరుణాంతరంగా

వరములు వర్షించవా వెంకటరంగా !

హే కొండాంతరంగా

ఏడుకొండల  వెంకటరంగా కోనేటీరంగా

నా కనుకులకు కానరావా అంగరంగా వైభవంగా !



# శ్రీనివాసుని  సంకీర్తనలు



మల్లెలో యమ్మ మల్లెలు

మావూరి మరు మల్లెలు

మాయదారి మోహన మల్లెలు

మధురాంతకుడు మెచ్చిన మల్లెలు

సిరి సిగలో మెరిసిన మల్లెలు

హరి ఎదపై మురిసిన మల్లెలు

 # శ్రీనివాసుని  సంకీర్తనలు 

ఎండిపౌఇన కౌమ్మ మీద

ఒట్టుబౌఇ గట్టులేని చిలకనై

వాడిపౌఇ రాలిపోయే ఆకునై

మొడు బారిన మొవినై

పెన్నెల కురవని రేఇనై

మేఘుము లేని చినుకునై

నీరులేని ఏరులో నావనై

నిర్యాణమైన తోడులేని నడవిలొ

నిదురరాని నీడలేని నారినై

నెదురుచూచి నారాముడికై

నేరేడుపండ్లుతో నెదురేగితిని

రానె వచ్ఛితీవా రామా

నీరు పోసినావు ఈకౌమ్మకు

తేనీరు చల్లినావు తుమ్మెదపైన

నాజన్మ తన్మయత్వముతొ తరించినే రామ....

 శ్రీనివాసుని  సంకీర్తనలు 

రామ నామం ఆలపించక రోజు గడవదే

హరి నామం ఆలకించక నా నావ సాగదే

రామనామము కొలవని వేకువలేదే

రామునిరూపము చూడక పొద్దు వాలదే

ప్రతి మాట ఆ రాముని మాట

ప్రతి పూట ఆ రాముని పాట

నా మాట పాట ఆట రామ నామమే

నా భావం గానం ప్రాణం రామ నామమే

నా మనసు మది ఎదా నిండా రాముని రూపమే

నా అక్షరార్చన పదార్చన స్వారార్చన రామ నామమే

నా ఆలాపన, ఆరాధనా, ఆత్మీయ్యగానం ......

అయోధ్య రామునికే , ఆనంద రామునికే ...

అనునిత్యం కొలవాలి ఆ రాముని నామం

అనుక్షణం చూడాలి శ్రీరాముని స్వరూపం !!!

రామనామం నారాగం

రామనామం నాగానం

రామనామం నాజపం

రామనామం నాజీవం

రామనామం నామతం

రామనామం నాజీవితం

రామనామం నాలోకం

రామనామం నాసర్వం

రామదాసు వారసత్వం

రామరూపనికి దాసీత్వం

రామరామునీకే నేను అంకితం!!!



# శ్రీనివాసుని  సంకీర్తనలు



మెరీశావే మురిపించావే

హృదాయ్యాన్ని కదిలించావే

ఉహానగరిలో ఊరించావే

ప్రేమనగరిలో పడవేశావే

అందాలు విసిరెసావే

బంధాలకు వలవెసావే

స్వర్గాపురి నుంచి వచ్చావే

గోపాలపురిని గోలచేసావే

ఉదయానికి  వేకువనీవే

వృందావనరెయాకి వెన్నెలనీవే

మాధురానగరిని మత్తెక్కించావే

ప్రౌదయానగరిని తడిపేశావే

మనసుకి మహారాణివినీవే

గోపాలునికి గోకులరాణివినీవే!!!!



# శ్రీనివాసుని  సంకీర్తనలు



ఓరోరీ దేవుడా వేంకటేశుడా

వద్దొద్దురో దేవుడా వేంకటేశుడా

నీవరములు నాకొద్దు వేంకటేశుడా

ఊరువాడ వదిలినాను వేంకటేశుడా

వేవేలఆమడ దూరమాయే వేంకటేశుడా

ఏడేడుకొండలు ఎక్కినాను వేంకటేశుడా

దారిపొడుగు ఖర్చులాయె వేంకటేశుడా

వడ్డికాసులు ఏమీలేవ్ వేంకటేశుడా

కానీ అటుకులు తెచ్చినాను వేంకటేశుడా

సంతకు వెల్లలేదు వేంకటేశుడా

పువ్వులైన తేలేదు వేంకటేశుడా

కానీ పాటలు పాడుతాను వేంకటేశుడా

వరములు నాకొద్దు , వరహాలు నాకొద్దు

సొమ్ములు నాకొద్దు , పుణ్యమూ నాకొద్దు

ఓరొరి దేవుడా వేంకటేశుడా

దర్శనము నాకివ్వు వేంకటేశుడా

సర్వదర్శనము చూపించు వేంకటేశుడా

సమ్బరమాయెనూ నామనసు వేంకటేశుడా!







నువ్వంటే ఇష్టం రా రామా

నువ్వులేక కష్టము రా శ్యామా

నాగుండె లోగిళ్లలో నీవే రా రామా

నాకలల కౌగిళ్ళలో నీవే రా శ్యామా

మదిలో నీఊహలు విహంగాలై

మానససరోవరంన హంసలలా ఒలలాడుచుంటే

మనసున నీరూపం మానసవీణై

సుధారసమందార మంజీర నాదమై మ్రోగుచుంటే

కలల కౌగిలిలో చిక్కిన నామేను

వెండి మేఘమై తత్తరపాటునాయె

తీగ మెరుపై నిను అల్లుకపోయె

అందెల ఉరుమై నిను రాసుకపోయె

చిరుఆధారల చుంబనలో చిత్తడాయె

తుఫాన్ వెలిసిన తీరాన వెన్నెలాయె

ఒక్క క్షణము నిను వీడి నుండలేను

ఇక నీవు లేక నేను లేను

నువ్వంటే ఇష్టం రా రామా

నువ్వులేక కష్టము రా శ్యామా

శాశ్వితం కానీ అందం సూసి
మురిసేవు తరిచేవు తుమ్మెద

శాశ్వితమైన అందం సూడలేక
పక్కదారి పట్టేవు తుమ్మెద

బాహ్యముతో బంధాలు వేసేవు
భ్రమలోన బ్రతికేవు  తుమ్మెద

 **శ్రీనివాసుని**  **సంకీర్తనలు** 

జనం నచ్చినవాడు

జగం మెచ్చినవాడు

అడుగో ఆపదమొక్కులవాడు

అడుగడగొ ఏడేడుకొండలవాడు

అందరికి అభయమిచ్చువాడు

కొదువలెక కరుణించువాడు

జననమరణాలకు కారకుడు

జగమునేలు నాయుకుడు

ముల్లొకాలను ఆవహించినవాడు

మూడునామాల మహావిష్ణువువాడు



# శ్రీనివాసుని  సంకీర్తనలు



తూర్పు తెలతెలవారాలని

తపస్సు చేస్తోంది నీ ఆజ్ఞకోసం

తెల్లమబ్బు మాటున నిండు జాబిల్లి  దాగి

సుందరాంగుడుకి సెలవు

చెప్పాలనే సంబరపడుతోంది!

తెరలు తీయ్యగరారా తిరుమలేశ

ఉషస్సు వెలుగుల ఉషోదయంలో

మేలిముసుగులో నీ మోము మెరిసే సమయాన

సాగర అలల ఆరాటంలా సుప్రబాతమ్

కోయలై మకరంద మధురస్వరగానం చేస్తూ

మాధవా నీ  మేలుకొల్పుకై మురిసిపోతోంది

 శ్రీనివాసుని  సంకీర్తనలు 

ఓ మోహన మురారి
ఇక చాలు మీ అల్లరి

ఓ బృందా విహారీ
వేధింపకు ప్రతి సారి

ఓ వైకుంఠ శ్రీహరి
దయ చూపు నను చేరి

ఓ ప్రియభాంధవా ప్రేమతో
పలుకరిస్తే ప్రేమవనం

ఓ మాధవా మనసుతో
పలుకరిస్తే  నందనవనం

ఓ చిన్ని కృష్ణ  చూపులతో
పలుకరిస్తే  బృందావనం !

ఓ నందనందన మనసు
తుళ్ళి తుళ్ళి పడుతోంది

ఓ యసౌదనందన వయసు
మళ్లీ మళ్లిని ఆరాటపడుతోంది

ఓ వసుదెవనందన సౌగసు
వడి చేరాలని ప్రాకులాడుతోంది

ఓ అరవిందా కనువిందు చేసే
నీ అందం నా కనులకు కమనీయ్యం

ఓ గోవిందా వీనులవిందు చేసే
నీ గానం నా మనసుకు ఆత్మీయ్యం

ఓ ముకుందా తనువుముద్ద చేసే
నీ బంధం ఈ బృందావనానికి రమణీయ్యం

గానామైన నీదేరా

ప్రాణమైన  నీవేరా

మనసంతా నీదేరా

ఎదనిండా  నీవేరా

పలికించరా ప్రభువా





# శ్రీనివాసుని సంకీర్తనలు

నీ కళ్ళు కురిపించిన

అనురాగపు వర్షంలో

తడిసి ముద్దయ్యాను............

నీ హృదయం చిలికించిన

అమృతం త్రాగి

అమరుడినయ్యాను.......

నీ మనసు వలకబోసిన

మమకారంలో

మూగనైనాను........

నా పెదవులెప్పుడూ

నీ ప్రేమనే వుచ్చరించాయి...........

నీ తలపులెప్పుడూ

నాలోనే ఇమిడున్నాయి.........

ఇంకా ఎందుకు maadhava

మన మధ్య ఈ దూరం...........

రెండు మనసులూ ముడివేసి

వక్కటి అవ్వక ......

తప్పులు చేయటం మానవ సహజం

తప్పులు దిద్దటం  మాధవుని నైజం

క్షమించమని అడగడం మానవ నైజం

క్షమించాను పొమ్మనడం మాధవునికి సహజం

సమస్యలలో చిక్కడం అనేది మానవ సమాజం

సమస్యలు తీర్చడం అనేది దేవునికి సమంజసం

వరములు ఇమ్మనడమ్ మానవుని వంతు

వరములు ఇవ్వడం పరమాత్ముని తంతు

కాపడండి అని కోరడం నరుని తంతు

కాపాడి కరుణించడం హరి వంతు !!


# శ్రీనివాసుని  సంకీర్తనలు


వింటాడు నాపాట వేంకటేశుడు

ఆలకిస్తాడు నాఆలాపన ఆదిదేవుడు

ఏదో ఒకనాడు వస్తాడు ఏడుకొండలవాడు

ఏడు క్షణాలైన వింటాడు వేంకటేశుడు

రామ నామమే నా రాగం

గోవి నాదమే నా గానం

పరమాత్ముడే నా పల్లవి

నే పాడగా, గ్రోవి నూదగ, అందె ఆడగా

వింటాడు నాపాట వేంకటేశుడు

ఆలకిస్తాడు నాఆలాపన ఆదిదేవుడు

భాష రానివాడనై

భావమున్న వాడనై

భవబంధాలు నొదలక

భవసాగారాన్ని ఈదక

బృందావనము చూడక

భగవద్గీత  ననుసరించక

బహుదూరమైన గమ్యాన్ని

బహుసునాయాశముగా ఎంచుకొని

బాధలేన్నో పడుచున్న నాకు

భగవంతుని  తీరము దొరుకునా

భాగవతప్రియుని ఆశీస్సులు పొందేనా

భక్తవత్సులుడు బంధం కలుపునా

భక్తమనోహర రూపాన్ని దర్శించేనా!!!!

వెన్నియ్యల్లో వెన్నియ్యల్లో చందమామ
వయ్యారల నయగారల వెన్నెలభామా
రావే రావే రాగాల రేఞల చందమామ
ఏడుకొండలు ఏక్కిరావె చందమామ
వెన్నెలంతా ఒలికించవా  చందమామ
వెలుగులన్ని పండించవా వెన్నెలభామా
అందాలతో అలరించవా అన్నులమిన్నుల చందమామ
చందాలతో ఊరించవా  వెలుగుజిల్గుల వెన్నెలభామా
వెంకటేశునికి వందనాలు సెయ్యవే చందమామ
వరములన్ని బహుమానం చేస్తడే చందమామ
మోక్షమంతా మూటకట్టుకవద్దాము  చందమామ
మళ్ళామళ్ళా ఏడుకొండలు వెళ్లొద్దాము వెన్నెలభామా!!!

కరి మబ్బునై
కవితా కీర్తనల కుసుమాంజలి
కురిపించనా కొండలరాయుడి కై !

వెన్నెల మబ్బునై
వెన్నెల పూల కుసుమాంజలి
వర్షిన్చనా ఏడుకొండల రాయుడి కై !

సందె  మబ్బునై
సప్తస్వరముల సంకీర్తనాంజాలి
సమర్పించనా సప్తగిరుల రాయుడి కై !

పూసిన పువ్వు నై
పదములు నల్లే పల్లవల తీగనై
పరమాత్ముని పరవసింపజేసే పాటనై
అర్పించనా ఆలిమెలమంగా రాయుడి కై!

 శ్రీనివాసుని  సంకీర్తనలు 

రాయుడు గారో  ఓ రాయుడు గారో
రానె వచ్చితిరా రాగాల రాయుడు గారో !

రాయుడు గారో  కొండల రాయుడు గారో
కరుణించి కానవచ్చేదరా కొండల రాయుడు గారో!

రాయుడు గారో ఏడుకొండల రాయుడు గారో
విన్నపాలువిని వరములిచ్చేదరా వెంకట రాయుడు గారో!

రాయుడు గారో తిరుపతి రాయుడు గారో
తల్లీలాలాకే కోరికలు తీర్చేరా తిరుమల రాయుడు గారో!

రాయుడు గారో అందాల రాయుడు గారో
అభయమిచ్చి ఆదరించేరా ఆలిమెల మగడు గారో!



# శ్రీనివాసుని  సంకీర్తనలు



సత్యమే నీవు ధర్మమే నీవు

సర్వమే నీవు సకలమే నీవు

సంద్రమే నీవు చంద్రమే నీవు

శాంతమే నీవు  క్షమమే నీవు

వేదమే నీవు వరమే నీవు

గుణమే నీవు ఘనమే నీవు

రూపమే నీవు రాగమే నీవు

రమ్యమే నీవు రణమే నీవు

అభయమే నీవు ఆనందమే నీవు

అనంతమే నీవు అమృతమే నీవు

మోక్షమే నీవు  జ్ఞానమే నీవు

ప్రాణమే నీవు పరిపూర్ణమే నీవు

ప్రకాశమే నీవు పుణ్యమే నీవు

ధైర్యమే నీవు  దైవమే నీవు

జపమే నీవు జగమే నీవు

నేస్తమే నీవు నాదమే నీవు

ఏడుకొండల వెంకటనరసింహమే నీవు

గోవింద ....గోవింద  ....గోవింద.....!

-----------------------------------------------------------

ముగవోఐన గానానికి
మౌనమైన  హృదయానికి
జీవమే తిరిగి పోసితివి

నిర్జీవమైన  జీవితానికి
నిక్షిప్తమైన జ్ఞానానికి
వెన్నెల వెలుగు నింపితివీ

చేదోడులేని తొడుకీ
చేరలేని గమ్యానికి
నేస్తమై తోడు నిలిచితివి

నేను నీవు ఏకమై
నీవే నా లోకమై
సర్వదా శ్రీనివాసుని
సంకీర్తన చేయించితీవి


# శ్రీనివాసుని  సంకీర్తనలు


గోపాల బాలుడే
గోవింద లోలుడే
గాన గంధర్వుడే
గగనంతార వాసుడే

గోవులు గాంచినోడే
గీతా పారాయణుడే
గొవర్ధన గిరిధారుడే
గోపిక మానసచోరుడే

గిరులలో వెలిసినవాడే
గోకులములో గలిసినాడే
గుండెలోగిళ్లలో దాగినాడే
గుళ్ళుగోపురాలలో నిలిచినాడే

గంసుని గ్రక్కినోడే
గరుడ వాహనుడే
గజేంద్ర మోక్షుడే
గోపాలుడే గోవిందుడే











మధుర మనోభావాలకు మణిహారం

మకరంద మనోఉల్లసానికి మోనహారం

కలల కవితాఊహలకు కన్ఠాహారం

ప్రియురాలి ప్రేమకళ్లాపాలకు ప్రేమహారం

ప్రకృతిపరువాలు పరమాత్మునికి  పూలహారం

మేఘము ముసిరి మబ్బే మసకేసిందిలే

మనసే ముడ కేసిన్దిలే

మంచు కురిసి చలి వేసిన్దిలే

తనువూ పడకేసిన్దిలే

వెన్నల విసిరి వెండి కొండే మెరిసిందిలే

వలపే విహరిన్చిన్దిలే

మొగ్గే విరిచి పువ్వై పుచినదిలే

పరిమళాలు వెదసల్లిందిలే

పదమే కలిసి పాటై పాడిందిలే

పరమాత్ముడే పరవసించేనులే

  

# శ్రీనివాసుని సంకీర్తనలు

మది మారిపోయింది
మాట మురిసిపోతుంది
మనసే మరలిపోయింది!

తీరని తాపంతోనంది మాధవా ............
రాధను మళ్లీ మళ్లీ  చుడవా .........
నంటూ ముందుకు సాగిపోయింది!

కాలం కాసేపు ఆగింది
ఆదమరచి కనురెప్ప వాల్చింది
కమ్మని కలగా కరిగింది...!

తనువె తడబడుతోంది
తుమ్మెదలా ఝుమ్మని ఎగిరింది
ప్రేయసీ ప్రేమనాదం మోగించింది

మది తలుపులు తెరిచింది
ఎదలో తెరలు తొలగించింది
మది మాధవుణి ఉహలతో నింపింది
ఎద రాధమాధవుణి రూపంతో నిండింది!

ఆర్తితో కృష్ణా.......యనికొలచింది
వేణువై ఒడిలో ఒదిగి పొమ్మంది, లీనమై తన జన్మను తరింపజేయమంది !





# శ్రీనివాసుని సంకీర్తనలు

రగిలిందిలే కొండ గాలి

రమ్మందిలే కన్నె వాలి

మోగిందిలే మోహన మురళి

ఆడిందిలే అందెల రవళి

కరిగిందిలే కరి మబ్బు కోరి

కురిసిందిలే నింగినుంచి జాలు వారి

విరిసింధీలే వయ్యారల కేళీ

పొంగిపొరలిందిలే ప్రేమ కడలి

మెరిసిందిలె మనసుల మార్పిడి

ఉరిమిందిలే తనువల తాకిడి

ఒక్కటైయ్యిందిలె రాధామాధవ జోడీ!!!







కోటలోని రాణి, కొండ దొరను కోరింది

మేడలోని మహారాణి, ముకుందునికి మనసు ఇచ్చింది

మనసు విరిసి మురిసి మమకారము పొంగి ప్రేమ పల్లవించింది

జగం తరచి తరచి జంటగచేర్చి జంపాల పాడింది

వెంకటేశుని వరించాలని యువరాణి

ముకుందునితో మూడుముళ్లుకు మొగ్గింది మానసావాణి

నింగి నేలని ముద్దాడింది ఆక్షణం

ముక్కోటి దేవతలు మురిసిసే ఆమరుక్షణం

మోగింది సానాయి మేళం

వంత పాడింది వేదమంత్రం

సిగ్గుబిళ్ళతో  తలవంచింది మూడుముళ్ళు వేయించుకోంది

ఏడుఅడుగులు నడచింది

రతనాల రాశులు ముత్యాల తలంబ్రాలై రాలె

జరిగింది జగతికీ జగదేకవీరునీతో కళ్యాణం

అక్షింతల ఆశీర్వాదమందుకొంది అందాల జంట.

 శ్రీనివాసుని  సంకీర్తనలు 

చందమామ చందమామ కిందికి రావమ్మా

వెన్నేలమ్మా వెన్నేలమ్మా వెన్నెల ఒలికించాళమ్మా

పండువెన్నెల పరువాలన్ని పరువాలోయమ్మా

నింగిలోని నెలరాజుని చూసి

ఈ నేలమీది నల్లనిరాజు నవ్వాలోయమ్మా

ముగ్గురు తల్లులు ముద్దుగా మురవాలోయమ్మా

అంబరాన నుండి అందివచ్చిన

అందాల చందమామ అందాలు చూసి

మా ముద్దుల  మేనమామ నంటూ

సంబరాలలో శ్రీరామచంద్రుడు మునగాలోయమ్మ

సిందులు వేసి సరాగాలు పాడాలోయమ్మా

అయొధ్యాపురిలొ సంక్రాంతి కాంతులు వెలగాలోయమ్మా !!!



# శ్రీనివాసుని  సంకీర్తనలు



వేయ్ వేయ్  వేయ్రా దరువైరా దరువైరా సిన్నోడా

దయతలిచి దీవించు దేవుడు రా!

మనశెట్టి దంచికొట్టి దరువేస్తే

ఏడుకొండలు మద్దెలై మోగలిరా

శ్రీనివాసుడు కూడా సిందుయ్యేలిరా

సిరి సూసి పక పక నావ్వాలిరా

మనఇంట సిరిసంపదలు పొంగాలీరా

వేయ్ వేయ్  వేయ్రా అడుగులోన అడుగైరా భజనైరా

భగవంతుడు మనతో బంధమెయ్యాలిరా

భక్తితోనా అడుగేసి భజనేస్తే

భద్రాద్రిమెట్టు భక్తితో వోలలాడాలిరా

దివినించి భువికి భగవంతుడు దిగిరావాలిరా

దేవలోకము కన్నా భూలోకము మిన్నని

భగవంతుడు మెచ్చాలిరా బంగారు లోకమవ్వాలిరా

మాధవుడు మరలా మనలో మెలగాలిరా !!!!





# శ్రీనివాసుని సంకీర్తనలు

సిరిలచ్చుమమ్మో జర్ర జాగరతనమ్మో

సీనమ్మో వచ్చి వగలాడుతునాడమ్మో

సీర సుట్టినాది, సింగారించినాది

కాటుక దిద్దినాది , కుంకమ నద్దినాది

ముక్కర మెరిసినాది,లోలాకులు లాడించినాది

ముడి వేసినాది, మల్లెలు ముడిచినాది

గాజులేసినాది, పట్టీలు పేర్చినాది

బుట్టబట్టినాది, తంబురా తట్టినాది

కుందనపు బొమ్మ కదిలినాది

కొండ దిగినాది కులుకులాడినాది

సోయగాల బొమ్మ సిరి లచ్చుమమ్మ

సోది చెపతానమ్మనని సరసమాడినాది

జరిగి,జరిగే,జరగబోయేది జెపతానమ్మ

గోరి వచ్చేనాధుడి వివరాలు విన్నవిస్తానమ్మ

మనసులోనున్నవాడు మాణిక్యమమ్మా







మనువాడేవాడు మూడులోకాలేలేవాడునమ్మా

సూర్యచంద్రులు సేతిన ధరించినోడమ్మా

సింహమంటి సిన్నోడు సెయ్యబడతాడమ్మ

ఏడుకొండలు దిగివస్తాడమ్మా,

వెదుకుకొంటూ వస్తాడమ్మా

మూడు ముళ్ళు వేస్తాడమ్మా,

ఏడుఅడుగులు వేస్తాడమ్మా

వయ్యారాల వరలచ్చుమమ్మ

నీతో వగాలాడినాడమ్మా!

సింగారాల సిరీలచ్చుమమ్మ

నీతో సరసాలాడినాడమ్మా!

------------------------------------------------------------------------------------------------------------------------------------------



# శ్రీనివాసుని  సంకీర్తనలు



జాబిలి నీవైతే స్వామి  రేయిని నేనవుతా

రాముడు నీవైతే స్వామి  రాయిని నేనవుతా

జగన్నాధుడవు నీవైతే స్వామి జగమే నేనవుతా

మాధవుడవు నీవైతే స్వామి మురళిని నేనవుతా

సింహము నీవైతే స్వామి బింకను నేనవుతా

బుద్ధుడు నీవైతే స్వామి బోధిని నేనవుతా

పురుషోత్తముడవు నీవైతే స్వామి  ప్రకృతి నేనవుతా

సత్యము నీవైతే స్వామి పాపము నేనవుతా

నీ జననం కోసం స్వామి మరణం నేనవుతా

 శ్రీనివాసుని  సంకీర్తనలు 

అందాలతో నాకు బంధాలు వేయకు

చందాలతో నన్ను కట్టిపడ వేయకు

కన్నులతో పలుకరించు ఆ వలపులు

ఎన్నటికి మరువరాని తలపులు

అందెలతో ఆదరించు ఆ రవళులు

ఎప్పటికీ చెరిగిపోని గురుతులు

మరలా వచ్చెను... మనసే ఇచ్చెను..

మరలా వచ్చెను... మనసే ఇచ్చెను...

కలలా కవ్వించెను... వలపే దోచేను..

కలలా కవ్వించెను... వలపే దోచేను..

నింగిలోని వెన్నెలంత వృందావనికే సొంతము

రాధలోని సొగసులంత కృష్ణయ్యకే సొంతము

మరి నేను వెళ్ళి రానా,  మేలుకొలిపి రానా

మందిరానా మనవారితో ముచ్చటించి రానా!!!

ఊగవె ఊగవె ఊయాల

వలపుల తలపుల జంపాల

నే పాడాల నీవు ఆడాల

నీ ఒడిలో నే ఒదగాల

రేయీ పగలు మారవలా

రాధతో నేను మురవాలా

సాగరమై మాపయనం సాగాల

కలకాలం మాప్రేమ నిలవాల !



# శ్రీనివాసుని  సంకీర్తనలు



పులకించినే నామనసు పిల్లనాగోవి గనానికి

రంజించిసే నావలపు రసరమ్య రాగానికి

తరించిసే నాతనువు తేనెలొలొకు నాదానికి

వీనుల విందు చేయు వీణామృత రాగం

ఆశల పొందు చేయు  ఆనాందాభైరవి రాగం

కన్నెల కందు చేయు కలువకన్నుల కళ్యాణి రాగం

మల్లెలు పూయించు మోహనరాగం

వెన్నెల కురిపించు వేణుగానం

నెమలులు నర్తించు నవమోహననాదం

మొడుబారిన మొవికి జీవమిచ్చు గానం

చెదిరిపోయిన భావాలకి చేరివచ్చు రాగం

కన్నెమనసుకు తీగనై తోడునొచ్చు నాదం

వదలుకు రా , వదలుకు రా వేణుగోపాల

వృందావనిలో ఒంటరిగా నను ఈవేళ

విరహంతో వేధింపకురా వేణుగోపాల

దాగుడుముతలు నాడకు తుంటరివై ఈవేళ

గోవులను గోపికలను నడిగాను గోపాలుడేడని

కొమ్మలను రెమ్మలను వెదికాను కృష్ణుడెక్కడని

వృందావనం వేణుమాధవుడు లేక వెలవెలనాయే

నాధుడు కానరాక  నా మనసు కలవరమాయె

వేళాయేరా దేవా వేళాయేరా వేదికదిగి రారా

ఆరాధనను అల్లరి చేయక ఆర్తి అలకబూనకనే రారా

గగనాంతారాన గువ్వవై గ్రక్కున రారా

గుండెల నిండుగా నీ వలుపులను నింపగ రారా



# శ్రీనివాసుని  సంకీర్తనలు



మదిలో పులకింతలు రేపే యమునా గలగలలు

రసమయడోలికలలో ఊయలలూగించే స్వరఝురులు.

ధవళకాంతుల నడుమ వెన్నెల సెలయేరులా

ఆర్తిగా పరుగెత్తుకు వచ్చావు ఆరాధాని పిలుపుకి

దివినుండి భువికేతెంచిన దానవేంద్ర

వృందావనములో  రాధ కౌగిట్లో  బంధీనైతీవీ

గీతలో భవబంధాలకు బహుదూరమన్నవాడివి

విల్లు విరిగినట్టుందే

ఘడియ మోగినట్టుందే

బాణం గుచ్చినట్టుందే

బంధం వేసినాట్టుందే

మనసు కరిగినట్టుందే

మోనము ఆగనట్టుందే

మాట పాడినట్టుందే

హరి వచ్చినట్టుందే

సీతకు జోడియినట్టుందే

దండ మార్చినట్టుందే


# శ్రీనివాసుని  సంకీర్తనలు


చల్ల గాలిని రమ్మని పిలిచా

చిన్ని కృష్ణుని కానరమ్మని కొలిచా

వెన్నెలభామని రమ్మని పిలిచా

వన్నెల వాసుదేవని కోరి వలిచా

సెలయేరుని సరదాగా రమ్మని పిలిచా

సందెవేళకు సౌగకళ్ళవానిని ఆహ్వానించా

గోపికలను గంధముతో రమ్మని పిలిచా

గోపాలుని పులసుగంధాల ప్రేమతో పూజించా

చల్లగా చందమామను రమ్మని పిలిచా

వన్నెల వాసుదేవని వేగరమ్మని కొలిచా

సింగమై దుమికినాడు శివమెత్తి నాడినాడు

శంఖము మోగించకనే సమరము సాగించినాడు

ఎరుపెక్కిన కళ్ళతో ఎర్రబారెనెవాడు

భారమైన హృదయంతో బరువయెనెవాడు

చిరుమందహాసుడు శివాలెత్తి శివమెత్తినాడు

చల్లనిచంద్రుడు భగభగమండే సూరీడైనాడు

వేచిచూసేవాడు విసుగై విసురుడైనాడే

వెనమెనసున్నవాడు వేటాడే సింగమైనాడే

నిలువెత్తు నిండుకొండనైన నారాయుణుడు

మహోగ్రజ్వాలాప్రద్యుమ్నుడై మరిగినాడే

ఉడుకెత్తు  ఉచ్వాసనిశ్వాసాలతో ఊగినాడే

అదిరించు బెదిరించు రక్కించు రుద్రనేత్రుడై

మెరుపులను మెరిపించి ఉరుముల్ని ఉరికించి

పీడిగుల్ని పుట్టించి ప్రళయమును సృష్టించి

నింగినేలపెక్కుటిల్లేల ప్రళయభయంకర రూపుడై

ఎలుగెత్తి పిలివగనే యముడల్లే కదిలి

స్తంభమున సమరమును మోగించి

తొడసెట్టి తీరుతెన్నెలు లేక చీరి

తాపమును తాళలేక తన్దనాలాడే

తిరువెంకట నరసింహుడు ......



# శ్రీనివాసుని



# సంకీర్తనలు



ప్రతి మాట ఓ పాట, ప్రతి పాట ఓ బాట

ఆ మాట  రాముని మాట

ఆ పాట రామునికి పూల బాట

ప్రతి నిత్యం తలవాలి ఆ రాముని మాట

ప్రతి రోజు పాడాలి రామయ్యకు ఓ తియ్యని పాట

ఆ రాముని మాటలోని రమ్యమును రుచించాలి

ఆ రాముని పాటలతో గమ్యమును చేరాలి

ప్రతి మాట రామునిపై ముత్యాల జల్లై కురవాలా

ప్రతి పాట రామునికి రతనాల కీర్తి కిరీటమై వెలగాల

ఆ రాముని మాట పాటలలో ఆనందం పొందాలి

ఆ ఆనందంతో నిండు నూరేళ్ళు గడవాలి !!!



# శ్రీనివాసుని  సంకీర్తనలు



సూర్యుడువో చంద్రుడువో

మాబ్రతుకులలో వెలుగును నింపే దేవుడువో

ఇంద్రుడువో మహేంద్రుడవో

మామనుషులులో మెలిగిన మాధవుడువో

దేవుడవై వచ్చినావు దయతో దారి చూపినావు

మహిమాన్యములతో మాధవుడై మెప్పించావు

రాముడువో కృష్ణుడువో

లోకులు మెచ్చిన లోకాలన్నినెలినా లోకనాధుడావో

పురుశొత్తముడువో తిరుమలేసుడువో

మాకు సిరిసంపదలు ప్రసాదించే శ్రీనివాసుడువో

దశావతారుడువై ధర్మముతో ధరణిని పాలించావు

వేంకటేశుడువై కరుణతో వరములు వర్షించావు

మాఆత్మలోని పరమాత్మా ,సకలజీవులకు సర్వాత్మ

సర్వదా మీసేవలో నిమగ్నమైన మమ్ము

సర్వకాలలో సంరక్షించు దేవా దేవాదిదేవ మీకు మా శతకోటి ప్రణామాలు సమర్పయామీ!!!

నంతలోనే ఎంత లాలిత్వము

నంతలోనే ఎంత సున్నితత్వము

నంతలోనే ఎంత మధురత్వము

నంతలోనే ఎంత దండనత్వము

నన్నీ విద్యలు నెఱిగిన నెరజాణత్వము

నేమి ఎరుగనట్లు అమాయకత్వము

నీ లీలామ్రుతములను పొగడగా నాతరమా

నీవు ఆగ్రహించిన ఆపుట ఎవరి తరము



# శ్రీనివాసుని  సంకీర్తనలు



సకలకళాపారఙ్గుతుడవు ప్రేమకళాసరసుడవు

వెన్నమన్ను తిన్నవడవు వేదావేదాలకు ఆద్యుడవు

ధర్మము నెగ్గించుటకు దశావతారములు నెత్తినవాడవు

గీత దాటిన దుర్జునులను దండన చేయువాడవు

భక్తికి పరవశించేవాడవు ముక్తిని ప్రసాదించేవాడవు

సర్వలయలకు సర్వాంతరయామీపైన వెంకటేశుడవు

పొగుడుట  నాతరమా సామి ప్రసాదించిన వరము కాక

ప్రేమసేవభక్తితత్పరండనై ప్రాణామున్నంత పాదసేవచేసేద సామి!!!



# శ్రీనివాసుని  సంకీర్తనలు



మౌనవ్రత మందార మోహనరూప

ప్రేమకళా సరస నవమన్మథ రూప

శ్రీహరిహర రూప శరణం శరణం

పరమపవిత్ర రూప పాహిమాం పాహిమాం

భక్తితో భజన చేసేము బాధలు బ్రోవగా రారా

సేవచేసి శరణు వేడేము నభయ మివ్వగా రారా

పాదసేవచేసి పాహిమాం ననగా పాపలను హరించగా రారా

ఏడుకొండలునెక్కి వేడుకోనగా వరములను వర్షించగా రారా

నీవు కాదన్న దారెది మాకు, దిక్కు ఎవరు మాకు

దయతో మము బ్రోవగ రారా, ప్రేమతో మము పాలింపగా రారా

నావందనం నీకే సామి, నా ఆనందం నీవె సామి

ఆపదలు రానివ్వకు సామి అడుగడుగున ఆదుకోరా సామి

ఆపదమ్రొక్కుల వాడ, అడుగడుగు దండాల వాడ

ఏడుకొండలవాడ వెంకటరమణ సంకటహరణ గోవిందాగోవిందా !!!!

 శ్రీనివాసుని  సంకీర్తనలు 

ఘల్లు ఘల్లున మువ్వల సవ్వళ్ళు

అన్దియలై కదిలే హృదిలో సందళ్ళు

గొదారిలా పరుగెత్తెనే గుండెల్లో చప్పుళ్లు

సాగరమై తోనికిసే వలపుల పరవళ్ళు

రంగురంగుల హరివిల్లుల పందిళ్లు

రతానాలై మెరిసే మది ముంగిళ్ళు

బంధాలై వేసిసే మనసున సంకెళ్ళు

అలల ఎగిసి చుట్టివేసినే  కౌగిళ్ళు

నా లాలిత్వాన్ని లాలించే లలనుడి లీలలు

నా సున్నితత్వాన్ని చిదిమే కన్నయ్య క్రీడలు

నా రమణీయ్యముతో నాడే రమణుడి రాసలీలు

నాలో చక్కలిగిలిగింతలు పెట్టె చిన్నికృష్ణుడి చేష్టలు

యేమని వివరించ యమునా నా విరహవేదన

నేల వర్ణింప నాయెదలొని ప్రేమారాధన

ఎలా వదిలి వెళ్ళగలను వృన్దావననన్దుని కౌగిలి



# శ్రీనివాసుని  సంకీర్తనలు



దిగిరారా దిగిరారా సామి, దయ రాదా మాపైన సామి

కొండలోన ఏముంది సామి. కోనలోన ఏముంది సామి

కళ్ళలో నిలుపుకొంటాను సామి, కన్నతల్లిలా కాపాడుకొంటాను సామి

కొండదిగి రావయ్యా సామి ,ఏడుకొండలు నొదలి రావయ్యా సామి

గుడిలోన ఏముంది సామి ,నా గుండెల్లో దాచుకోనా సామి

ఆర్చనలలో ఏముంది సామి ,అన్నులమిన్నులగా ఆరాధించనా సామి

పూజలో ఏముంది సామి ,ప్రేమతో నీపాదసేవచేసుకొంటాను సామి

సేవల్లో ఏముంది సామి ,సంకీర్తనలు చేసుకొందాము సామి

ఆడుకొందాముసామి పాడుకొందాముసామి

గువ్వాల గగనానా విహరించివద్దాము సామి

స్వేచ్ఛగా స్వర్గముకెళ్ళి సిరిని చూసివద్దాము సామి

ఏమీ కావాలో చెప్పారా సామి

ఏమీ అడగాలో అడుగురా సామి

దాసుడై కలకాలం నీసేవ చేస్తాను సామి

దీపమై నీ చెంత వెలిగేను సామి  నా ప్రాణమైనా నీకిస్తా సామి!!!



# శ్రీనివాసుని  సంకీర్తనలు



భావ కవిత్వం, మధుర సంగీతం

రెండును నా మనసు నాగలికి కట్టి

భావసాగరమును భక్తితో దున్నుతు

బంగారు భావభవితకు సాళ్ళూ వేసి

ముక్తి అనే పారిజాత మొక్కను నాటి

మధుర భావామృతధారాలు ఒలికించి

కవితకంచెను చుట్టి సూర్యకిరణార్చన చేసి

ప్రేమాఆరాధనతో చిగురింపజేసి

వేదముల ఎరగా వేసి వృక్షముగా మలచగా

మంత్రములు మందారమకరందాలై

సుమధురసుగాంధాలై సువాసానలు వెదజల్లాగా

కొమ్మ చివరన కులికెడు కోయిలనై

పాడుచునన్ది తియ్యని పదములెన్నొ

పన్చామ్రుతపాటలు పండిన ఫలములై

పాలకడలిపై పయనించిన పన్నగసయుని పాదాల చెంత సంకీర్తనామృతభాండములై రాలెనె







జాలి లేని శిలకే నేను

తాళి లేని సతినైనాను

రేపటి నా  బ్రతుకును

తలచి లోకము వగచినను

చల్లని నీ చూపులు కోసం

రేయిపగలు ఆరాధించెను

కఠిన శిలని లోకం కోడ్డైకుచినను

కరిగే హృదయమున్న నాధుడని

కలకాలం  నిను మనసా నమ్మెను

జీవం లేనివాడని జనులన్నను

జగానికె జీవంపోసిన జగన్నాధుడని

నా జీవాత్మను జ్యోతిగ వెలిగించెను

జీవితం నీకే హారతిలా సమర్పించెను

రావా కృష్ణా రావా, రాధాకృష్ణా రావా

మనసంతా నీవే నిండిపోవా కృష్ణా,  కలకాలం నాకలలో నిలిచిపోరా కృష్ణా!!!

 # శ్రీనివాసుని  సంకీర్తనలు 

భగవంతుని తలవరొ బ్రదరు

సంతొషముగ బతకరొ బ్రదరు

పరుగెత్తి పాకులాడకు బ్రదరు

పట్టుకపొయెది ఏమిలేదు బ్రదరు

నాదీయన్న మిథ్యనొదలరా బ్రదరు

మాధవుడిలా మంచిగమెలగరా బ్రదరు

బంధాలన్ని నాటకామున్నంతవరకే బ్రదరు

జగన్నాటకములో మనం పాత్రధారులమే బ్రదరు

చివరకు చిల్లిగవ్వ కుడా మనతో రాదు బ్రదరు

చివరగా శ్రీనివాసుడే మనకు తోడు బ్రదరు

కొలవారో బ్రదరు కష్టాలు కడు దూరము బ్రదరు

తలవరొ బ్రదరు తిరుమలయ్య తోడునీకు బ్రదరు



# శ్రీనివాసుని  సంకీర్తనలు



నీ పాదధూళి రేణువు నేను

నీ పెదవులపై వేణువు నేను

నా హృదిలో ఆయువు నీవు

నా మేనులో అణువణువు నీవు

నీ గానానికి శ్వాసను నేను

నీ సేవకు పువ్వును నేను

నా మనసుకి నచ్చావు నీవు

నా కనులకు మెచ్చావు నీవు

నీ గుడిలో జ్యోతిని నేను

నీ ఒడిలో రాధని నేను

నా ప్రేమకు కానుకవు నీవు

నా పూజకు  ఆరాధ్యుడవు నీవు

నాలో ఇక్యమావ్వరా ఇష్ట దేవరా

నీలో నను లీనము చేసుకోరా లాలనా !!

ఒ గిరిధర మురళీమనోహరా

నా మనసుకు మెచ్చావురా

నా కనులకు నచ్చావురా

నా వయసుకు వెన్నెలవురా

ఓ సిరివర సహస్రనామసుర

నీకునాకు సరిజోడు కుదిరిందిరా

సరదాలకు లోటే లేదురా

సరసాలకు సమయమీదేరా

ఓ కరుణాకర కమలాకర

కోరి నిన్ను వలచానురా

కన్నె మనసు దోచుకోరా

కరుణతో కౌగిలిలో కట్టేయరా

---------------------------------- -----

 **శ్రీనివాసుని**  **సంకీర్తనలు** 

సన్నజాజి సన్నజాజి

సిరిసిగలో మెరిసే సన్నజాజి

శ్రీనివాసునితో సరసాలడే సన్నజాజి

చూసి చూడకనే సిగ్గేలనె సన్నజాజి

తాకి  తాకకనే విరుపేలనె సన్నజాజి

నలిగి నలగకనే నలుపేలనె సన్నజాజి

సోయగాలతో అలరించావే  సన్నజాజి

సొగసులతో సింగారించావే సన్నజాజి

మనసులను మురిపించావే సన్నజాజి

సరసాలడే సమాయాన చలచల్లంగా

శ్రీనివాసునికి నా మనవి విన్నవించవా

మనోహరమైన వేళలో  మెల్లమెల్లగా నా

మొక్కులన్ని తీర్చమని చెప్పవె సన్నజాజి



# శ్రీనివాసుని  సంకీర్తనలు



గుడి నొదలి రావయ్య నా సామి

గుండెల్లో కొలువాయ్యేదవంట నా సామి

కొండకి వచ్చాను సామి , నిన్నే కొలిచాను

కానరాక నేను కదిలేదు లేదంటా సామి

ఏడుకొండలు వచ్చాను,  వేడుకొంటునాను  సామి

వరము నివ్వక నొక్కాన్గుళము జరగనివ్వను సామి  || గుడి నొదలి ||

కాసులు కావల నీకు తలనీలాలు కావాల

మనసు కావాలా నీకు మూడుఅడుగులు కావల

ఆట కావల నీకు పాట కావల

ప్రేమ కావల నీకు నా ప్రాణం కావల

కాదు గూడాదు ననక నా సామి

కోరుకోరా నా సామి కొండల రాయుడా దేనీకైన  సిద్దము నేనంటరా సామి

శ్రీహరి సాదరముగా నీవు సెలవివ్వరా

కానీ నీవు నాకు నేడు కాన రావాల

రాకపోతే ఈ కంఠమ్లో ప్రాణం నాకెలరా

కొండ మీద నుంచి నే కదలాబోనురా  వెంకటేశుడను ఒదలి వెళ్ళబోనురా   ||గుడి నొదలి ||



శ్రీనివాసుని



సంకీర్తనలు



తల్లి యసోద నాది తప్పులేదు

రేపల్లె వీధులు నే తిరుగ లేదు

ఉట్టి కుండలు పగులకొట్ట లేదు

వెన్న జున్నులను నే తినలేదు

మన్ను నేను ముట్ట లేదు

గోపికలను గోల చేయ లేదు

నమ్మవే నాతల్లి నందనందుని

నడుగవే  అన్న బలరాముణ్ణి

వృందవనిలో వేణువు నూదుతుంటిని

గొవర్దనగిరిన గోవులు గాంచుతుంటిని

కాళంగిమడుగున కాళీ పని పట్టుచుంటీని

నందనవనమున నందరిని నలరించుచుంటీని

కాంతల కల్లిబొల్లి మాటలు నమ్మకే

కష్ట పెట్టుకోకు నీ వెన్నలాంటి మనసునే

కన్నయ్య కంట కన్నీరు నోలికించనీకే  || తల్లి యసోద||

 **శ్రీనివాసుని**  **సంకీర్తనలు** 

చూడాలని ఉంది నిను చేరాలని ఉంది

పాడాలని ఉంది నిను ప్రేమించాలని ఉంది

హృదయంలో వేదన నీ ఎదుట విన్నవించాలని ఉంది

చంధన గంధమై పూసుకోవాలని ఉంది

కుంకమ తిలకమై తీర్చుకోవాలని ఉంది

తోడుగా నీవొస్తే నీడై నీవెంటే ఏడుఅడుగులు నడవాలని ఉంది

మందార మకరన్దమై అల్లుకోవాలని ఉంది

ముత్యాల హారమై అలంకరించుకోవాలని ఉంది

మనసు నీకిచ్చి ముత్యాల పందిరిలో మనువాడాలని ఉంది

బంధం సబంధమై సాగించాలని ఉంది

రాధనై ఋణము తీర్చుకోవాలని ఉంది

శతజన్మాలు మాధవుని హృదిలో ప్రేమ పొందాలని ఉంది

 శ్రీనివాసుని  సంకీర్తనలు 

విశ్వ వీణకు తంత్రినై

వేద ఘోషకు వీణనై

పలుకనా రామ నామం

పలికించనా రామ రాగం

మోగించనా వేణు నాదం

ఆడించనా రాధ నాట్యం

కీర్తించనా రామ కీర్తనం

స్వరపరచనా శ్రీనివాస సంకీర్తనం

రంజింపచేయనా రామ హృదయం

వికశింపజేయానా నందనందనం

ఓలలాడించనా ఏడుకొండలవనం

 శ్రీనివాసుని  సంకీర్తనలు 

పువ్వులు ఘుమఘుమలాడే

గొపగోపికలు గుసగుసలాడే

మేఘాలు మిల మిల లాడే

నింగినేల నిగ నిగ లాడే

సొగసులు నవ నవ లాడే

తనువులు తహ తహ లాడే

కలగని ఊసులు వారిలో కలిగే

జంట వలపులు తలుపులు తెరిచే

నింగిన మెరుపులు ఉరుములు మెరిసే

నెలన చిలకాగోరింకల మోములు తడిసే

వృందావనమున వెండి వెన్నెల విరిసె







నీబాటను వీడిపోను

నీపాటను మరచిపోను

నాహృదయం మృదంగమై

నీనామము పలికినంతవరకు

నాదేహము దేవాలయమై

నీరూపము నిలిపినంతవరకు

నాగాత్రము తరంగమై

నీగానము చేయునంతవరకు

నాజీవితము నీకంకితమై

నీజన్మము నినుజెరునంతవరకు

కోరిన కోరిక తీరాలంటే

కోరక మోక్షం రావాలంటే

కొండకోన నడవాలి

ఏడుకొండలు ఎక్కాలి

వెంకటేశుడను చూడాలి

గోవిందా గోవిందాయనీ కొలవాలి

తలనీలాలు తిరుమలయ్యకి నివ్వాలి

మొక్కుల వడ్డీకాసులు చెల్లించాలి

వరములు వరహాలుగా పొందాలి

మోక్షం మూట కట్టుకొని రావాలి!!!



# శ్రీనివాసుని  సంకీర్తనలు



నిన్న మరల రాదు

రేపు మనది కాదు

నేడు యన్నది నీదిరా

రామ నామం తలవరా

ఆశల గుర్రం ఆకాశమై

రూపు లేని రేపటికై

కలల కడలిలో నావనై

సుఖం లేని బ్రతుకుకై

గమ్యం లేని పయనమై

గోవిందుని లేని గుడికై

ఎన్నాళ్లు ఈ ఎదురీత

ఎన్నేళ్ళు ఈ విధిరాత

నమ్మిన వారికి నమ్మకముగా

నేనున్నానని నిండుగ పలికే దేవా

వెనువెంటనే నను బ్రోవగ రావా

గూడు చెదరక ముందే గుండె ఆగక ముందే

శిలను కానని శరణు నిచ్చు శ్రీనివాసుడని

కరుణించగ రావా నను కాపాడగా రావా దేవా!

తెలుపో నలుపో

తేడాలేవు ఇక్కడ

కులమో గోత్రమో

కానరావు ఎక్కడ

వారందరిది ఒకే వర్ణం

అందరినోట ఒకే నామం

గోవిందునీదే వారి గోత్రం

అదే తిరుమల తిరుపతి క్షేత్రం

మొక్కిన వారికి మోక్షం

కొలిచిన వారికి కొంగుబంగారం

వేడిన వారికి వరహావరం

సేవించిన వారికి కల్గునుసకలం

కలియుగ కైలాసం

పావన పుణ్య క్షేత్రం

భూలోక వైకుంఠమ్ వెంకటచల నిలయం



# శ్రీనివాసుని



# సంకీర్తనలు



గోపాలుని సేవించాలి

గోవిందునే ధ్యానించాలి

రామనామమే పలకాలి

రంగనాధుని తలవాలి

మాధవునికే మనసునివ్వాలి

మహావిష్ణు పాదలకే మొక్కాలి

ఏడుకొండలు ఎక్కాలి

వెంకటేశుడుని దర్శించాలి

పాపలన్ని బాపుకోవాలి

పరమాత్మునిలో లీనమవ్వాలి

ఆనాడే ఆనందం పరమానందం

ఆనందం బ్రహ్మానందం// ఆనందం//

మాధవునికి మనసుకి మహాదానందం

ఆనందం పరమానందం // ఆనందం//



# శ్రీనివాసుని  సంకీర్తనలు



బొమ్మను చేసి బ్రతుకుననడిపిస్తావు

బంధము వేసి నాటకమాడిస్తావు

ప్రాణము పోసి తిరిగి తీసివేస్తావు

మనుజులను నీచేతితో శృష్టించావు

మనుషులుచేత నీశిలను చెక్కిస్తావు

మనుజులు కన్నా మాధవుడుమిన్నని

ప్రాణంలేనిశిలకే చేతులెత్తి మొక్కిస్తావు

కష్టాలు కాటిన్యాలు కావాలనే కలిగిస్తావు

కొలిచిన కరుణించి  కడుదూరము చేస్తావు

అహా ఏమీ లీలలు స్వామి

ఇక ఏమని వార్ణింప నీ లీలామృతాలు

ఏమని పాడేద నీప్రతిభాపాటవాలు

నా రాజువు నీవు నీరాణిని నేను

నా మనసున నీవు నీమమతన నేను

హృదయం పంచాను జగమే మరచాను

రేయి పగలు నీధ్యానంలో బ్రతికాను

ప్రేమతో నీలో నేను సగమైనాను

ఆర్తితో నాలో నీవు సంపూర్ణమైనావు

నీలో నేను నాలో నీవు నాతో నీవు నీతో నేను

రాధ మాధవునికై , మాధవ రాధారాణికై

ఒకరికొకరు తోడునీడై,ఇరువరము ఒకటై

ఇలా ఉండిపోనీ కల కాలం సాగిపోనీ

మన చరిత కథగా మిగిలిపోనీ











మాధవుడు మురళిగాంచిన వేళ

ఆనందమయం రాధ హృదయం

మధురం మధురం ఈ సమయం

సుమధుర మందార శోభితమ్

వెన్నెల వయనం వృందావనం

కాంతల కన్నులు కలవరం

వలపుల విరుపులు పలువరం

నీలో నేను నాలో నీవు

నాతో నీవు నీతో నేను

ఒకరికొకరు తోడునీడై ఇరువరము ఒకటై

ఇలా ఉండిపోనీ కల కాలం సాగిపోనీ !!!



# శ్రీనివాసుని  సంకీర్తనలు



అబ్బా అబ్బాబ్బా ఇంకా నేను ఆగలేనోయీ

అబ్బా అబ్బాబ్బా ఇంకా నేను ఆగలేనోయీ

తబ్బిబ్బులతో ఇక తాలలేనోయీ ఆగలేనోయీ

ఏడేడుకొండలు వెనువెంటనే దిగిరావోలోయీ

నను దూరం చేయకోయి నాప్రాణం తీయ్యకోయి

నామనసంతా నీవెనోయి నీవులేక నేనులెనోయి

నీ చెలిమిలోని చిలిపితనం చూడాలంటుందోయీ

నీకలిమిలోని కమ్మదనం  నను కావ్విస్తోందోయీ

రావోయి శ్రీహరి అల్లుకోవోయీ అందాలసిరినోయీ

ఉక్కిరి బిక్కిరి అయిపోయీ స్వర్గం నీకు పంచెనోయీ

మాధవా మరలా మరలా మేఘమై ముసూరుకోవోయీ

సన్నజాజీ సరసకు రావోయి సరదాలు నీకు పంచెనోయీ

తీయ్యని కలలెన్నో తీయ్యాగా తినిపించావోయి

తీరని తాపాలెన్నో తీరాన్ని దాటించావోయి

లాలా లాలా .... లాలా లలనా లాలించవోయి  ఒహో ఒహో హో.. హో ప్రేమగా పాలించవోయి







# శ్రీనివాసుని సంకీర్తనలు

శీనయ్య  శీనయ్య  ఓ  శీనయ్య శీఘ్రమెవ రావయ్యా

చిన్నబోయిన మాబతుకులు చల్లంగజేయలా రావయ్యా

గోవిందాయనీ పిలిచినా గోకులగగనాన దాగకోరయ్యా

ఆఘుమేఘూల మీద రావయ్యా ఆదరించి ఆదుకొవాయ్యా

కోలచినాము సీనయ్య కరుణించి ఓసారి రావయ్యా

కరుణతో మమ్మెలి, మా కష్టాలన్నీ కడతేర్చగ రావయ్యా

పురుషోత్తమా నేపే మాపంచప్రాణాలంటు ప్రార్ధించినామయ్యా

పుడమితల్లి తడియారక మునుపే పాలింపాగా రావయ్యా

కొండాకొనల చుట్టూ తిరిగితీమయ్యా మొక్కులన్ని తీర్చితిమయ్యా

కొండలంతా వరములు దొర్లించవయ్యా అమృత వర్షం కురిపించవయ్యా || శీనయ్య  శీనయ్య ||



# శ్రీనివాసుని  సంకీర్తనలు



కొండాకొనలలో ఏడుకొండలలోహరిదాసులు కోయిలలై

కొలిచినారు కీర్తించి శ్రీనివాసుని సరిగమలు పాడినారు

వెండికొండలలో ఏడుకొండలలో వేదాంతులు వెన్నెలలై

వెంకన్నసన్నిధిలో వేద మంత్రాలు పఠిస్తూ పూయించినారు

తిరుపతికీ బండెనక బండి కట్టి భక్తులు తీరీనారు బారులై

తిరుమల పురవీధులలో భాజాభజంత్రీలతో తందానాలాడినారు

చిటపట చినుకులతో తొలకరి జల్లులతో

గోవిందనామాలతో పరిభక్తి భావాలతో

తిరుమల గిరులు తోనికిసాలాడగా

మహాపుణ్యక్షేత్రం  కిటకిటలాడగా

చలించినది ఫలించినది శ్రీనివాసుని మనసు

సిద్ధించినది తరించినది శ్రీదాసుల మనవి

ఏడుకొండలవాడా వెంకటరమణా గోవిందా గోవింద

సప్తగిరులవాసా సంకటహరణా గోవిందా గోవింద



# శ్రీనివాసుని  సంకీర్తనలు



పిలిచిన పలికెడి పరమాత్మ

దయతో దాసులను పాలింపగరారా

దారి చూపువాడవై, దయార్ధ హృదయుడవై

ధర్మ సంస్థాపకుడువై, ధరణిపాలకుడవై

దేవదేవుడవైన దశావతరక రామ

హరిని స్తుతించే హరిదాసులకు దండనేల

కొండలరాయుడును కొలచిన కష్టాలేల

నారాయుణుని నమ్మిన నష్టాలేల

పిలిచిన పలికెడి పరమాత్మ  దయతో దాసులను పాలింపగరారా

కలియుగంబున ఇది కడయనక కోరిన వరములివ్వగ రారా

తలచిన వెంటనే తోడై రారా  దండ మెట్టిన దయ గొనరారా గోవిందా

ఆజన్మాంతము ఆది దేవుని ఆరాధించెద

దేహమున్నంత వరకు దాసాను దాసుడనయ్యేదను